# రాణీ సోమ

కాజ రాధాకృష్ణ

చరిత్ర — ఆంధ్రదేశము శాతవాహన వంశపు రాజుల పాలనంలో ఉంది శకులు... బౌద్ధులు వచ్చి నాస్తికత్వం బోధించి వైదిక మతాన్ని రూపుమాప సమకట్టారు, మాధురీ పుత్ర శకసేన మహారాజు పాలకడు. కౌండిన్యుడు సచివుని తనూజుడు... మహారాజుకు బాల్యస్నేహితుడు. కొన్ని కారణాలచేత మహారాజు కౌండిన్యుని అవమానపరచాడు. కౌండిన్యుడు రోషంతో దేశాంతరం పోయి జావా రాణీసోమని కూడదీసుకుని మహారాజై ఆంధ్ర సామ్రాట్టు గర్వాన్ని అణచివేశాడు ... ఇది మూలంగా తీసుకుని వ్రాసిన రూపకము. కథా వస్తువును సమకూర్చిన మారేమండ రామారావు గారికి కృతజ్ఞతాభి వందనాలు ...

## మొదటి రంగము

(స్థలం; జావా ద్వీప రాణిమందిరం అంతఃపురం పరిభాగాన వరండాలో రాణీ సోమవ నిలబడి వీధివేపు చూస్తూవుంది. వయసు రమారమి ౧౮ ఏండ్లు. తెల్లని దేహచ్ఛాయ. బహు నాజూకైన మనిషి. వీధివేపు చూస్తున్నకొద్దీ ఆమెలో ఆశ్చర్యమూ... భయమూ ... చెప్ప రాని ఆతృతా అధికంగా వుప్పొంగుతు వున్నాయి. ఒకమారు అలా లోనికి చూసింది)......

రాణి: ఎవరు అక్కడ...?

(లోపలినుంచి) ... అమ్మా...వస్తున్నాను.

రాణి: దాసీ...!

దాసి: (ఆతురతతో ప్రవేశించి) అమ్మా...? అవసరము...

రాణి: (ఆలోచిస్తూ) ఆఁ...? (వీధి వంక వ్రేలితో చూపుతూ) చూడు...! ఆ ...జన సమూహం మధ్య...ఎవరది...?

దాసి: (పరికించి చూసి) అమ్మా... అందరూ మనప్రజలే...!

రాణి: సరి... అదికాదు, అక్కడ...మనభటులెవరినో పట్టుకు వస్తున్నారు...కనపడటం లేదూ...?

దాసి: (చూస్తూ) ఊఁ...ఔనమ్మా...!

రాణి: ఔను...కాదు అన్న సమాధానం నాకు అనవసరం, (అటే చూపిస్తూ)... ఆ... అజానుబాహుడు... బ్రహ్మవర్చస్సుముఖాన తాండవిస్తూవున్నాడుండే... ఆశ్చర్యంగా నలువంకలా చూస్తూ... మెల్లమెల్ల కదలివస్తున్న ఆయువకుడు, ఎవరైవుంటాడా అన్నది మా ప్రశ్న,

దాసి. (తెలివిలపోతూ)...అమ్మా... ఔను. యువకుడు కాదూ...? ఐనా క్రిందికి పోయి కనుక్కొని వస్తాను,

(వెళుతుంది)

రాణి: (ఆ వసారాలోనే పచారుచేస్తూ ప్రక్కనేవున్న సోఫాలో ఆసీనురాలౌతుంది. ఏదో ఆలోచనలో ఉండి ఆగి ఆగి మాట్లాడుతుంది) నవయువకుడు... అతని ముఖంలో యింత మారానికినీ డా విద్వత్ప్రభ కనపడుతూనే ఉంది, కర్తవ్యతానిశ్చయుడైచూస్తూవున్న అతని కనుపాపల్లో మంచి చురుకుదనం, ప్రతిభా తెల్లి విరుస్తున్నాయి... మందగమనాన్ని పొందిన అతని పదచలనంలో మహారాజ వాళి లీవిద్యోతము ఔతూంది. (ఆగి)...ఎవరో...! ఏ ప్రాంతీయుడో...!

(దాసి ప్రవేశిస్తుంది)

దాసి: (ఆతురతతో) అమ్మా...!

(రాణి ఆమెవైపు తిరుగుతుంది)

రాణి:...దాసీ...!

దాసి: (వచ్చేనవ్వును లోలోన అణచుకుంటూ) అమ్మా...! అతను పరదేశి వాడట,. ఎన్నివిధాల ఎన్ని ప్రశ్నలు వేసినా ఏమీ మా గొణుక్కుంటూనట కాని సరిగా సమాధానం చెప్పడట. అందుకే భటులు అనుమానించారట కచేరిలో నిలబెట్టడానికి...తమ అజ్ఞకై ద్వారం వద్ద... (అని చేతితో అటువేపు చూపిస్తుంది)

రాణి: (నాలుగు అడుగులు వేసి) ఎవరు ... అక్కడ...?

(ఒక భటుడు ప్రవేశించి వందనము చేస్తాడు)

భటుడు: రాణివారికి జయము.

రాణి: ... అ ... నిర్బంధితుడు యెవరు...?

భటు: దేవా తమయాజ్ఞయైనచో వెంటనే తచేరీలో తేల్చగలము.

రాణి: ఒకే ...

భటుడు: మహారాణివారి అనుగ్రహం...

రాణి: విను ...! అతణ్ణి యిక్కడికే తీసుక రావలసిందిగా మా ఆజ్ఞ.

భటు: ప్రభో! (అని వెనుకకు అడుగులు వేసుకుంటూ నిష్క్రమిస్తాడు.)

దాసి: అమ్మా ... ! (ఆర్ధోక్తి)

రాణి: ఏమది...?

దాసి: తమ... ఆజ్ఞ...!

రాణి: ఆజ్ఞ ...!! నిష్ఫలమా ...!!

దాసి: అమ్మా ...! తమకు మనస్ఫూర్తిగా పలికిందేనా... అని సందేహం.

రాణి: దాసీ...! నీకు వృద్ధాప్యం ముదిరినకొద్దీ బుద్ధిమాంద్యం పట్టుకొంటోంది. ఈ అధికారిణిగొంతులో యున్నదైనా అపస్వరంగాని ... భిన్నత్వను లుగాని విన్నావా...!

దాసి: అమ్మా...క్షమించాలి నా అభిప్రాయం అదికాదు.

రాణి: ఐన...?

దాసి: అమ్మా...! పరదేశస్థుడికి తొలుతనే అంతఃపుర ప్రవేశమా... అని!

రాణి: పిచ్చిదానా...! పరదేశస్థుడైతే మాత్రం పవిత్రవనస్కుడు కాడా...!

దాసి: కాదు తల్లీ ...! అతని గుణగణాలు తెలియకముందే... ఇలా చేస్తే ..!

రాణి: (నవ్వి) ముప్పువస్తుంది... అంతేనా...!

దాసి: అమ్మా... అతడువస్తే...

రాణి: ఏముంది...? మాసి ప్రసంగించాలో... పరీక్షించాలో నిర్ణయిస్తాను.

దాసి: అమ్మా... తమ... గౌరవం...?

రాణి: దాసీ... నువ్వు వట్టి వెఱ్ఱిదానవు, సరే త్వరగా ఆతెర అడ్డుగాలాగి... అవల పక్క ఓ ఆసనం సిద్ధంచెయ్యి...!

దాసి: ఆజ్ఞ...!

(ప్రక్కగా తొలుగుతుంది)

(ఇద్దరుభటులు ఇరవైనాలుగేళ్ళ యువకుణ్ణి అక్కడికి తీసుకవస్తారు. దాసి వెళ్ళి అతనివంక ఎగాదిగాచూసి గౌరవపూర్వకంగా ఆహ్వానించి ... ఆసనం చూపిస్తుంది. "దయచెయ్యండ"ని సంజ్ఞ ఇదంతా సంజ్ఞాబద్ధమైందేకాబట్టి అతడికి అంత బాధలేదేమో... ఆసీనుడైనాడు. ఆ తెరకావలి ప్రక్కన ఎవరో ఉన్నారని గ్రహించి... రాణీ యేమోనని సందేహిస్తూ... సవినయంగా కూర్చున్నాడు. రాణిముఖం ఒక్కమారుకళాన్వితమైంది, హృదయంలో యేదో ఉత్సాహతరంగాల రొద మిక్కుటమైంది. ఏమైనా తనరాణిత్వానికి లోటులేని దర్జాతో...)

రాణి:-దాసీ...! వారిదేశమేదో అడిగివారాడు.

దాసి:-(అతనివైపు తిరిగి ద్వీపపు మాతృభాషలో) ఆర్యా...! యువకుడు యెగాదిగా చూశాడు. మాట్లాడడు. కాని గౌరవపురస్సరంగా లేచి నుంచున్నాడు.)

దాసి: అమ్మా... జవాబులేదు.

రాణి: దాసీ...మీభాషలో పృచ్ఛించు

దాసి: (తన దేశభాషలో) ఆర్యా...! తమ వాసస్థానం...? (యువకుడు సమాధానం చెప్పడు. కాని తనలో యేమేమో సంస్కృతంలో గొణుక్కున్నాడు దాసీ వింటుంది. కాని రాణికి స్పష్టంగా తెలియలేదు.)

దాసి: అమ్మా...! తమకు అప్పుడప్పుడు...ఒంటరిగా కూర్చుని...చదువుకుంటారే... అలా......

(రాణీముఖంలో ఒక మెరుపు మెరిసింది. తేటమొఖకం మందహాసం చేసింది. ఏదో స్ఫురణకువచ్చినట్లుగా తలపంకించింది. సంస్కృతంలో మాట్లాడ సాగింది)

రాణి: స్వామీ ...

యువ: (ఆశ్చర్యంతో చూస్తాడు. స్త్రీయబంధు సమాగమమైన వాడిమాదిరి సంతోషం కనబరుస్తాడు. అ పలకరించింది స్త్రీ కంఠమని గ్రహించాడు. ఇదంతా తెరలోవున్న రంధ్రాలద్వారా రాణీ కనిపెడుతూనే ఉంది. (ప్రకాశంగా) శ్రీమన్మహారాజ్ఞీ! ఏమి సెలవు...?

రాణి: శ్రమకాదనుకుంటే తమ దేశమేదో సెలవిస్తారా?...!

యువ: రాజ్ఞీ...! మాది కృష్ణాతీరమందున్న ఆంధ్రదేశం.

రాణి: ఆర్యా...తమ నామధేయం...?

యువ: (సవినయంగా) అందరూ కౌండిన్యుడంటారు.

రాణి: స్వామీ...! తమరీవేషంతో యిక్కడికి యిలా యెందుకు వచ్చారో వినవచ్చునా...!

యువ: (నిట్టూర్పాడు. అసలే జడలిఉన్నాడో యేమో...పూర్వ స్మృతీ...తన పరాభవమూ స్ఫురణకువచ్చి అలసట కూర్చినాయి. ఆ వికారం అతనిముఖంలో కనబడుతూనే ఉంది.) మహారాజ్ఞీ...! చెప్పినా లాభంలేనిదీ...చెప్పక తప్పనిదీ నాస్థితి. ప్రశ్నకానికి నారాక అచింత్యమనీ...అదియం ప్రతిజ్ఞా పాలనమని చెప్పి ముగించతలచాను. క్షమింప ప్రార్థన.

రాణి రెండుమూడుసార్లు బైట కూర్చున్నయువకుని ముఖంచూస్తూవచ్చింది. అతని భావాలు అగ్రాహ్యాలనీ...అనూహ్యాలనీ అనుకుంది. వెంటనే...అతనికి శ్రమ కలిగించటానికి యిష్టం లేనట్లు సూచిస్తూ.

రాణి: దాసీ...!

దాసి: అమ్మా...!

రాణి: వారు మిక్కిలిగా ఒడలిఉన్నారు. మన పురోద్యానంలోని సౌధంలో వారికి అనుకూలవాసం ఏర్పరచి వెంటనే వచ్చి చెప్పు.

(దాసి వెళ్ళిపోయింది)
(యువకు డావలించాడు)

రాణి: స్వామీ...!

యువ: మహారాజ్ఞీ...!

రాణి: తమరిని యింతగా బాధించినందుకు మన్నించి...మా భటుల్ని క్షమించాల్సిందని ప్రార్థిస్తున్నాను మీ దర్శనంవల్ల జన్మ తరించిందనే చెప్పాలి. ఎందుకంటే... బాల్యంలోనే నాకు ఆంధ్రదేశం అన్నా...ఆంధ్రప్రజ అన్నా బహుభక్తి కుదిరింది. ఎప్పుడు ఉన్నత శిఖరాలతోనూ...పుణ్యనదులతోనూ వన ప్రదేశాలతోనూ నిండిఉన్న స్థలాన్ని దర్శిస్తానా అనీ...ధన్యత పొందుతానా అని అతృతపడుతుండేది. నాకు యిలా అనుకోకుండా తాము దర్శనము యిచ్చినందుకు కృతజ్ఞురాలిని.

యువ: రాజ్ఞీమణీ...! తమ ఆదరణకు యెంతో కృతజ్ఞుణ్ని.

(దాసి వచ్చింది.)

దాసి: అమ్మా...సర్వం సిద్ధంచేసిఉన్నాయి.

రాణి: ఆర్యా...! తమరు యీ దాసీవెంట వెళ్ళితే సర్వ సౌకర్యాలూ కలుగుతాయి. మేము సంధ్యా సమయానికల్లా తిరిగి దర్శనం చేసుకుంటాం, సెలవా!

యువ: రాజ్ఞీ! శుభమస్తు.

(రాణిలేచి ప్రక్క వరండాలోకి వెళ్ళిపోయింది. యువకుడు నిలబడి తెరవంక కృతజ్ఞతా సూచకంగా చూసి. దాసి దారితీస్తూండగా అనుసరించాడు)

* * *

[౭వ పేజీ చూడుడు]

# సంస్థానప్రజలయిబ్బందులు

ప్రజలు మట్టిపాత్రలవలె చూడబడుట

కొన్నిపత్రికల అభిప్రాయములు

౧

బికనీరు సంస్థానాధిపతియొక్క జూబిలీ ఇటీవల జరిగినది దానివిషయమై అభిప్రాయమిచ్చుచు "కాంగ్రెసు సోషలిస్టు" పత్రిక యిట్లు వ్రాసినది

"జూబిలీ దీపతోరణములలోని దీపముల చమురును, ప్రజల ఎముకలనుండి వచ్చినదని చెప్పిన అతిశయోక్తి యేమియు నుండజాలదు. సంస్థానాధిపతిగారి కుటుంబ ఖర్చులకు ఆసంస్థానముయొక్క మొత్తముఆదాయములో వేయింటికి ౧౨౭ పాళ్లవంతున ఖర్చగుచున్నది విద్యపై వేయింట ౧౫ పాళ్ళ ఖర్చుచేయబడుచున్నవి. ౧౫౦మంది జాగీర్దారులవంటివారలకు మొత్తముభూములలో మూడవవంతు పైగా యున్నది. వారలను పాలించుశాసనము లేదు. వారలపై పౌజ్దారీ అభియోగములుచేయ వీలు లేదు.

"జూబిలీ ఉత్సవముల ఖర్చులు ప్రజలను పీడించిలాగిన సొమ్ముతో చెల్లింపబడినవి ఎంత తక్కువ జీతముపొందు ప్రభుత్వోద్యోగియైనను జూబిలీఖర్చులకై తనజీతములో నూటికి ౧౦ వంతును కోతను భరింపక తప్పదయ్యెను. రైతులు అవసరమున్నను లేకున్నను చెల్లింపవలసివచ్చెను రైల్వే ప్రయాణికులుకూడ జూబిలీపన్ను చెల్లింపక తప్పదయ్యెను. ఇక కొస్తో కూస్తో ఉన్న వారలకు తగినట్లు దక్షిణ సమర్పించుకొనవలసి వచ్చెను."

౨

మార్వారులోని కొన్ని గ్రామములను మేవారు, జోధపూరు సంస్థానములకిచ్చివేయు విషయమై ఇండియాప్రభుత్వ రాజకీయశాఖకు ఆసంస్థానముల దర్బారులతో జరుగుచున్నటు చెప్పబడిన రాయబారములను గూర్చి విమర్శించుచు "సెర్వెంటు ఆఫ్ ఇండియా" పత్రిక యిట్లు అనినది:—

"ఈవిషయము వంతయుగూర్చి రాజకీయశాఖవారు, ఆగ్రామస్థులకు ఏమియుచెప్పకుండ దర్బారులతో రాయబారములు సలిపినది ఎందుకో తెలిసికొనుట కష్టముగానున్నది.

# "అభివృద్ధిలో నున్నదా" మైసూరు!

"డెయిలీ హెరాల్డు" పత్రిక ఎత్తిపొడుపు ప్రశ్న

బ్రిటిషు ప్రభుత్వముయొక్క మాట అనిన చాలు, మైసూరుప్రభుత్వము నూరుకొనును.

మైసూరులో ఇటీవల పోలీసువారలు చేసిన లాఠీప్రయోగమును గూర్చియు, కాంగ్రెసుతో ప్రభుత్వమునకు ఏర్పడినసంఘర్షణమును గూర్చియు లండను "డెయిలీ హెరాల్డు" పత్రిక విమర్శించుచు, మైసూరు "అభివృద్ధిలో నున్నదా!" యని ఎత్తిపొడుపు స్వరముతో అడుగుచున్నది

"ఇతర సంస్థానములలో అనేకములను పోల్చిన సంతోషావహము, కాని ప్రజాప్రభుత్వములు పాలించు దేశములతో గాని, లేక అంతదూరమెందుకు సగము ప్రజాపరిపాలనగల బ్రిటిషిండియాతో గాని పోల్చిచూచిన, ఇంకను ఎంతోదూరము ముందు నడువవలసియున్నది

"బెంగుళూరులో పోలీసులకును విద్యార్థులకును జరిగిన విచారకరమైన పోరాటము మైసూరులోని కొందరు సోషలిస్టులసంఘములకును కాంగ్రెసు కార్యకర్తలకును వాక్స్వాతంత్ర్యము లేకుండ అణచుటకు యత్నించుటవలననే సంభవించినది.

"అట్టి నిర్బంధములు సంస్థానాధిపతుల ఇష్టములో నుండునను మాట ఖానూను లెక్క ప్రకారము ఒప్పుకొనదగియున్నను, వాస్తవముగా బ్రిటిషుప్రభుత్వము స్నేహితభావముగా ఒక్క మాట జారవిడచినచో ఈ కఠినవిధానములోని కాఠిన్యము తగ్గునను నిస్సంశయము ఎవ్వరు నెత్తురు చిందకముందే, ఆమాట చెప్పవలెను."

"మొదట గ్రామస్థులకు తెలిపియుండవలసినది తీర్మానము చేయునంతవరకు గ్రామస్థులకు ఏమియు తెలుపకుండ రాయబారములను సాగించుట, నైజాము గారు చెప్పినట్లు ప్రజలను చట్టీలవలె చూచువారలకుండి అత్యుగ్రమైన విమర్శను ఆకర్షించుటయే యగును.

# కృషి వాణిజ్యముల అభివృద్ధికి తిరువాన్కూరు విధానము

"లాండ్ మార్టుగేజిబ్యాంకు" స్థాపన

త్రివేంద్రము ౧౫ నవంబరు

ఇంతవరకు తిరువాన్కూరుప్రభుత్వమువారిచే నిర్వహింపబడుచున్న "లాండ్ మార్టుగేజి బ్యాంకు" (భూమితాకట్టుబ్యాంకు) చేయుపనిని, పరిశ్రమలకు కావలసిన అప్పులనిచ్చువిషయమున ప్రభుత్వశాఖలు చేయుచున్న పనినికలిపి, ఇపుడు ప్రభుత్వమువారు తిరువాన్కూరు ల్యాండ్ మార్టుగేజ్ అండ్ ఇండస్ట్రియల్ బ్యాంకు అను క్రొత్త సంస్థ నేర్పాటుచేసి దానికి అప్పగించుటకు నిశ్చయించినారు

ప్రభుత్వమువారు వ్యవసాయకులఋణములను తగ్గించుటకై ఒకశాసనముచేయించి, ఆశాసనానుసారము ఋణము లెంతెంత తగ్గింపవలెనో నిర్ణయించుటకు సమాధాన సంఘములను ఏర్పాటుచేసినారు దీనివలన లాండు మార్టుగేజి పని భారము ఎక్కువగును దానికి తగినట్లు బ్యాంకు విస్తరింప జేయవలసియుండును కావున క్రొత్తబ్యాంకిని స్థాపించ దలపెట్టినది ఈబ్యాంకు రైతులనుండి తాకీలను భూమి పన్నులను ప్రభుత్వమువారు వసూలు చేసికొను నట్లే వసూలుచేసికొనుటకు అధికారమీయబడినది

ఈబ్యాంకు వ్యవసాయమునకు కావలసిన గొప్పచిన్న అప్పులను, పరిశ్రమలకు కావలసిన పెద్దఅప్పులను, భూములు మిషన్లు మున్నగువాటిని గిర్వి పెట్టుకొని, అప్పులు దీర్ఘకాల వాయిదాలలో తీర్చువీలగునట్లు, ఇచ్చుచుండును అప్పుల ప్రతి ఆరుమాసములకొకసారియో లేక ప్రతిసంవత్సరమునకొకసారియో వాయిదాలుగ తీర్చుట కేర్పాటుచేయబడును ఈఏర్పాటువలన తిరువాన్కూరులో పారిశ్రామికాభివృద్ధికిని, వ్యవసాయాభివృద్ధికిని మంచి ప్రోత్సాహము కలుగునని నమ్మియున్నారు

క్రొత్తబ్యాంకు ౫౦లక్షలరూపాయల పెట్టుబడి గలిగియుండును ప్రస్తుతము ౨౫ లక్షల రూపాయలు మాత్రమే వాటాలుగ పంచబడును కొన్ని ప్రభుత్వఖజానాలపనిని ఇంపీరియల్ బ్యాంకికి అప్పగించుటకు నిశ్చయింపబడినది

# అంబోతులు

ఫలవంతమగు వ్యవసాయమునకు బలముగల పశువులే ముఖ్యసాధనము

మీరు ప్రతివత్సరము మీ పశు సంపత్తిని వృద్ధిపరచుకొని బలముగల పశువులను, దేహారోగ్యము సంరక్షింపజేసి బలము పుష్టి కలిగించగల పాలను హెచ్చింపజేసికొనుటకు కృషిచేయుడు!

వ్యవసాయమునకు చక్కని శక్తియు అత్యవసరము, [illegible] కృషీవలునికి కడుపునిండ ఆహారము చేకూర్చుటకు [illegible] పశుసంపద్వృద్ధికి బలముగల [illegible] పెంపొందించుటకు ఆవుల మందలలో బలముగల అంబోతు నుంచుట అత్యవసరము. అవ్వులవలన [illegible] అభివృద్ధి చెందుటకు మందలలోనుండు యీ కోడెలు తల్లిదండ్రుల [illegible] ఆవులు చక్కని సేవకు పాలిచ్చుచుండినవిగా చూచియుండవలయును వ్యవసాయమునకు ఉపయోగించుకొను యెడ్లలో, పూర్వము యీ కొరతయుండు [illegible] మొక్కవ, కండబలము కలిగినవాని కోడెలలో నుంచినచో [illegible] ప్రభుత్వమువారు వ్యవసాయకుల అనుకూలమునకై స్థాపించిన క్యాటిల్ ఫారము—పశుమందల—లందు విషయములే ముఖ్యముగా గమనించి చక్కని విత్తనపుకోడెలను సంతానాభివృద్ధికై పెట్టబడుచున్నవి ప్రభుత్వమువారి ఫారములనుండి కొనబడు కోడెలు, యెట్లు యెందుకు బలముగలిగి యుండునో, వాటిసంతానమెందులకు శక్తివంతమై వ్యవసాయానుకూలములుగా నుండుచుండునో వేరుగా వివరించుట యనవసరము

నూరు ఆవులుగల యొకమందకు రూపము, ఆకారము, బలము, పుట్టుపు [illegible] చక్కగాగల యొకఅంబోతు సరిపోవును వీని విషయమై జిల్లాలందలి పశువైద్య శాఖాధికారుల సలహాపొందవలసినదని యిందుచేయబడు [illegible] ఇట్టి అంబోతులెచ్చట చిక్కగలవను ప్రశ్న కలుగవచ్చును. ప్రభుత్వము వారి ఫారములలో సులభముగా చిక్కగలవు కోడెలు సుమారు రెండు సంవత్సరముల వరకు యీ కార్యము నెరవేర్చగలవు పంజాబునందలి ౪౦౦౦౦౦ ఆవులలో ౪౦౦౦౦ కోడెలుగలవు వీనియందు కాలానుసారము మార్పులు జరుగుచుండుటచే ప్రతిసంవత్సరము ౫౦ సంవత్సరముల వరకే యివి యుపయోగపడుచుండుటచే ౫౦౦ క్రొత్త కోడెల యవసరము కలుగుచున్నటుల తెలియుచున్నది

ప్రపంచమునందే ప్రభుత్వము రైతుల కవసరమగుకోడెల సప్లయి చేయజాలదు కోటి స్వయముగా కృషీవలులే అట్టి విత్తనపుకోడెను సంపాదించి వాటిని చక్కగా జాగ్రతతో పోషించుటకు ప్రయత్నించిన యెంతోయూ లాభము చేకూరగలదు

గ్రామమందలి స్థితిగల రైతు, జమీందారుడు, పెద్దపట్టేదారుడు, మక్తేదారుడు, జాగీరాదారు యిట్టిఅంబోతును తన మందయందు చేర్చిన అది తనగోవులకు తగియుండును. దీనివలన తనమాత్రమునకే గాక గ్రామమందలి రైతులందరికి యుపయోగపడును

వీరట్టికోడెను పశువైద్యశాఖవారి పరీక్షానంతరము కొనుటవసరము గ్రామమును వర్తమాన స్థితుల ననుకరించుదానిగా చేయుట వీరి ప్రథమ కర్తవ్యము. వీరు మార్గదర్శకులుగా నుండవలెను. వీరికృషివలన గ్రామము పలువిధముల అభివృద్ధి గాంచుననుట నిశ్చయము గ్రామోద్ధరణమునకు వీరుపోటివారు ముందంజ వేయుచున్న గ్రామము బాగుపడుట [illegible]

గ్రామమందలి యితరరైతులు [illegible] మున పంచాయతీబోర్డు, సహకార [illegible] ద్వారా యిట్టి అంబోతులను సేకరింపగలయును స్వయముగా వారు కొనుగోలుచేయుట నిశ్చయము

ఆరోగ్యవంతములగు కుటుంబములకు, వ్యవసాయాభివృద్ధికి చక్కని పశువులు ముఖ్యమను రహస్యము జ్ఞప్తియం దుంచుకొనదగినది చక్కని పశుసంపద యేర్పడుటకు చక్కని కోడెలు, [illegible]ముగల అంబోతులుండుట ముఖ్యము.

# నిజాంరాష్ట్ర ఆంధ్రపత్రికా రచయితల మహాసభ

(మా విలేఖరి)

హైదరాబాదు నవ ౨౨

నిజామాబాదునందు డిసెంబరు మొదటి వారమునందు జరుగనున్న ఆంధ్రమహాసభ సమావేశసమయమున ప్రయత్నములు జరుగుచున్నవని తెలియుచున్నది

# డార్జిలింగు పోవుటకు మహారాజులుకూడ భయపడిరి.

డార్జిలింగుకొండప్రాంతములో అక్కడక్కడ విప్లవ [illegible] చేయునని భయపడి బెంగాలు [illegible] పూర్వము శాసనోల్లంఘనము [illegible] అక్కడికి మంచిగాలికొరకు వెళ్ళిన [illegible] వారు అడ్డములేకుండ పోవుటకు కొన్ని షరతుల నేర్పరచిరి. ఇప్పుడు [illegible] మొదలగువారు దీనివిషయమై పత్రిక ఇపుడు విమర్శించుచు [illegible] నిర్బంధములచే సంభవించిన [illegible] "రాజులు మహారాజులు [illegible] ప్రాంతపు ఆరోగ్యకరమైన మనోహరమైన గాలిని కృతజ్ఞతతో వినియోగించిరి"

# నిజాంరాష్ట్ర చేనేత పారిశ్రామిక మహాసభ

నిజామాబాదలో జరుగునది [illegible]

(గోలకొండ ప్రతినిధి) [illegible]

నిజామాబాదు [illegible]

నిజామాబాదులో డిసెంబరు [illegible] తేదీలందు జరుగనున్న ఆంధ్రమహాసభ సందర్భమున డిసెంబరు [illegible] నిజాంరాష్ట్ర చేనేత పారిశ్రామిక సమావేశము జరుపబడనున్నది. [illegible] ఆహ్వానసంఘము ఏర్పరుపబడినది [illegible] దేవపల్లి విఠోబా, యావరు జనార్దనపంతులు వెంకట్రాములు, గుంటక వారలు ప్రచారమునకై పర్యటనము చేయుచున్నారు. మహబూబాబాదు వాస్తవ్యులు శ్రీ వనము కృష్ణమూర్తి ప్లీడరుగారు మహాసభాధ్యక్షతవహించెదరు.

వేములవాడ వాస్తవ్యులగు శ్రీ [illegible] కటకశెట్టి [illegible] ఆహ్వానాధ్యక్షులుగా యెన్నుకొనబడిరి

## జోధపురము, ఉదయపుర సంస్థానములు

## మార్వాడుప్రాంత మభిలషిం చుట హాస్యాస్పదము

—— మార్వాడు సంస్థానముల ప్రకటన

—— రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ మేర్పరచిన మార్వార్ విభజన ను ... వారు మార్వార్ ప్రాంతమందలి కొంతభాగము ఉదయపూర్, జోధపూరు సంస్థానాధిపతులు అభిలషించు విషయమై యిటుల ప్రకటన గావించుచున్నారు.——

... చరిత్రలో ... ౧౮౭౦ ... గలిగిన మార్వాడు ప్రాంతమందలి గ్రామములు — తోడ్‌గఢ్, ... చాంగుచితార్, కొట్కా—రా ... బ్రిటిషు ప్రభుత్వమువారు ... ౩ ప్రాంతమున తమ ... కొనిరి ... బ్రిటిషు ... ప్రాంతములు ... సంస్థాన సైన్యమును గ్రహించుచు వానియందు శాంతి ... యుటకు కొంతవర మేర్పరచిరి ... పర్వత ప్రాంతీయులు సంస్థానా ... లుగా కుండిరనుట నిశ్చయము.

ఈ సంస్థానముల ప్రభుత్వములవారు ... యాధారముల ప్రయత్నము విఫల ము ... రాయ భారమునందు వుకటములు ... రంత తొలిగింపబడిరి.

బ్రిటిషు మార్వాడు ప్రజలతియగు బాటులను ... ప్రభుత్వము వారు దయ్యు, సాయముతో ... హించిరి ప్రజలలో అరాజకత్వ మేర్పడుటచే బ్రిటిషు ప్రభుత్వము వా రన్నియు నణచివేసి తమ పాలనమునందుంచిరి.

బ్రిటిషు ప్రభుత్వము వారీ ప్రాంతములను తమ అధీనమునందు గ్రహించుటకుపూర్వ మీ ప్రాంతీయులే సంస్థానాధీశుల అధిపత్యమును గ్రహించి యుండిరి.

కాబట్టి ఆయా సంస్థానాధీశుల, యీవిష యమై, కోరికలు న్యాయపూరితములు కాజాలవు.

"తిరిగి యీప్రాంతములు జోధపురము, ఉదయపురము సంస్థానముల నాధీనపరచుట విశ్వాసఘాతకమగునని కల్నల్ స్లైడు గారు మడిచిన ఒ క్యము లింకను గ్రంథస్థములై గలవు.

ఆ ప్రాంతీయులకు శాసనసభ, జిల్లాబోర్డు లలో యున్నికాధికారము ప్రసాదింపబడినవి. బ్రిటిషు ప్రాంతీయులకున్న హక్కులన్నియు వీరనుభవించుచు ఇప్పుడా ... విరంకుశాధికారము క్రిందికి వెళ్లుట కిష్టగించజాలరు.

ఈ ఉపసంఘ సభ్యులు ఆయా సంస్థానములలో సంచారము సలిపి అచ్చటి నిరంకుశ పాలనాచిత్రములను కన్నులారగాంచియున్నారు. ఇట్టిస్థితియందీ ప్రజలు సంస్థానాధికారుల పాల నములోనికి చేరజాలరనుట నిశ్చయము

## ప్రజామండలి, పౌరసత్వ స్వాతంత్ర సమితి సంస్థలు అక్రమ సంఘములు

జోధపూరు నవ ... ౨౩

ఘనతవహించిన మహారాజాగారు జోధపుర మందలి ప్రజామండలి పౌరసత్వ స్వాతంత్ర్య సమితిని, మార్వాడుమండలి హైసమతి శాఖా సంస్థలను అక్రమసంఘములుగా నిర్ణయించి నటుల ప్రభుత్వమువారు ప్రకటించుచున్నారు

కొన్నిరోజుల పూర్వము ప్రజామండలి అధ్యక్షులు నిర్బంధింపబడియుండిరి. ప్రస్తుతము బరోతా యందు విచారణ జరుగుచున్నది.

## గోకినేపల్లి దీపోత్సవము

హరిజనులు పాల్గొనుట

(ఒక విలేఖరి)

గోకినేపల్లి నవం ౨౨

ప్రతిసంవత్సరమువలెనే ఈ సంవత్సరముకూ డా గ్రామములో కార్తీక పౌర్ణమినాడు దీపో త్సవము జయప్రదముగా జరిగినది సవర్ణులును, హరిజనులును ఉత్సవమునందు పాల్గొనిరి. శ్రీ ము వేంకట్రామయ్య చౌదరిగారు హరిజనులకు హిందూమతమును గురించి చెప్పుచు ఇదివరకు స వర్ణహిందువులు మిమ్ము వేర కష్టములకులోను చే సియున్నారు ముందట్టిపనులుండ నేరవు. మీకే కష్టములుండుచో తెలిపిన వాని నివా రణకు ప్రయత్నము చేయుటకు సంసిద్ధులమై యున్నాము అనిరి. పిదప తిరువాతి చావా వెంకటసుబ్బయ్యగారు ... హరిజను లు ... గోహింస చేయ రాదని, ... రామనామమును స్మరించవ లెను అని హరిజనులకు ప్రబోధించిరి

తరువాత దేవ పసాదములు యొసగబడెను. రాత్రి ౧౧గంటల కుత్సవము ముగిసెను.

# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర కార్తీక బ॥ 2

గురువారము

## నిజాంరాష్ట్రపరిషత్తు

మౌల్వీ అబ్దుల్లసన్ సయ్యదలీ గారి అధ్యక్షతన సమావేశమైన నిజాం రాష్ట్రపరిషత్తుగావించిన తీర్మానము, ప్రజాప్రముఖులకు ప్రభుత్వమువారు రాజ్యాంగ సంస్కరణ సూచనల జేయు టకై నియోగించిన ఉపసంఘమందు గాని, ఆ ఉపసంఘముయొక్క పనియం దుగాని విశ్వాసములేదని ధ్రువపరచు చున్నది. లేనిచో ప్రభుత్వ నియుక్త మైన ఉపసంఘము చేయవలసినంతపని నంతయు మరల మన ప్రజాప్రముఖులు చేయుటకేల పూనుకొనవలెను? ఇపుడు చేయబోవు రాజ్యాంగ సంబంధములగు మార్పులు మరికొన్ని వండ్లవర్యంతము ప్రజల మంచిచెడ్డలను నిర్ణయించు చుం డును. కాబట్టి ఇప్పుడే ఈ మార్పులు ప్రజా హితానుకూలముగ జరుగునట్లు చేయుటకు జాగ్రత్త వహించవలెనని ప్రజాప్రముఖుల హృదయములు ఆందో ళన పడుచున్నవి.

ప్రభుత్వ నియుక్తమైన ఉపసంఘము ప్రజాప్రముఖుల అభిప్రాయములను కను గొనునో లేదో స్పష్టము చేయబడలేదు. ప్రజలనుండి అభిప్రాయములను విచారిం చక ఉపసంఘమువారు తమసూచనలను చేసినచో అవి ప్రజాభిప్రాయానుగుణము గా నుండునని నమ్మకమేమి? ఇంకను ఆ ఉపసంఘము ప్రజలనుండి అభిప్రాయములను విచారించి కనుగొను నట్లు చేయుటకు మన పెద్దలు ప్రయత్నిం చియుండవచ్చును. అప్పటికైనను ప్రజా భిప్రాయమునకుబద్ధమై ప్రభుత్వమువారి ఉపసంఘము సూచనలను చేయునను విశ్వాసము లేదు. కాబట్టి మన ప్రముఖు లు ప్రజాభిప్రాయమును వేరుగ ప్రభుత్వ మువారికి నివేదించు కొనదలచినారు.

ప్రభుత్వము వారి ఉపసంఘము చేయు సూచనలను ప్రభుత్వమువారు అంగీక రించి తీరవలెనను నిర్బంధ ముండజాల దని ఉపసంఘమును నియోగించుచు చేసిన ప్రకటనయందే గలదు. అట్లైన ప్రజాప్రముఖులు ఆ ఉపసంఘము వారు చేసెడిసూచనలను చేయనిచ్చి వాటిని ప్రకటింపజేసి, తర్వాత ఆసూచ నలపై ప్రజాభిప్రాయమును వెల్లడిచేయ రాదాయని అడుగవచ్చును. కాని ఇంత దూరము అటసాగనిచ్చి అప్పుడు ప్రజా భిప్రాయముతో చేయబడిన సూచనల నన్నింటిని సంపూర్ణముగ మార్పించ వలసియున్నచో, మార్పించుట కష్టమై నదని. కనుక ఇపుడే ప్రజలకు ప్రతినిధిగ నుండగల ఒకసంఘమును నిర్ణయించి, ఆసంఘముచే ప్రజాభిప్రాయాను కూల ముగు సంపూర్ణ రాజ్యాంగ సంస్కరణ ప్రణాళిక నొకదానిని నిర్మింపజేసి, ప్రజా మోదిత మైనదానిని ప్రభుత్వమువారికి నివేదించుకొనుటకు తలపెట్టబడినది. అట్టి అన్నిప్రజలలో అన్నిపక్షముల వారికిని సమ్మతమైన ప్రణాళికను ప్రభు త్వమువారు సామాన్యముగ త్రోసివేయ జాలరని అభిప్రాయమై యుండవలెను నిజాంరాష్ట్ర పరిషత్సమావేశమునకును అపరిషత్తుయొక్క తీర్మానమునకును ఇం తకంటె వేరొక వ్యాఖ్యానము ను చేయ జాలము.

ఇట్లు ప్రజలలో అన్ని పక్షములవారల అభిప్రాయ బలముగల ఒక రాజ్యాంగ ప్రణాళికను ప్రభుత్వము వారికి నివేదించు కొని, ప్రభుత్వమువారికి సులభముగా త్రోసివేయ వీలులేకుండునటుల చేయుట పరిషత్సమావేశకుల ఉద్దేశ్యమైనచో, ఆ పరిషత్తునందు జిల్లాలనుండిగూడ ప్రజాసేవాభిలాషగల ... ప్రముఖులు ఆహ్వానించ బడియుండుట అవసరము. అట్టి జిల్లాప్రముఖులు ఈ పరిషత్తులో లేరన్నట్లు స్పష్టమగుచున్నది. మహారాష్ట్ర ప్రతినిధులు, మహమ్మదీ య ప్రతినిధులు, పార్శీప్రతినిధులు (కవు దు) జాగీర్దారుల ప్రతినిధులను చేర్చుకొ నుటకై ప్రయత్నము జరుగుచున్నది) ఈవిధముగ సంస్కరణ ప్రణాళిక నిర్మా ణసంఘమునందు నానా తెగలకు ప్రాతి నిధ్యమిచ్చునపుడు, ఆసంఘమును నిర్ణ యించు పరిషత్తునందు రాజ్యాంగము వలన కష్టనష్టములను ఎక్కువగ అనుభ వించవలసినవారలైన జిల్లానివాసుల ప్రతినిధు లుండకపోయినచో, అదినిజ ముగ గొప్పలోపమే. ఇపుడు విచారణ సంఘమును మరింత ప్రజాప్రాతినిధ్యము గలదానిగ జేయుటకై తర్వాత చేర్చు కొనబడిన మరిపదుగురు సభ్యులలోనైన ను జిల్లావాసులు చేర్చకుండుట విచార కరము.

ఇపుడు పరిషత్సమావేశమందు పా ల్గొనిన వారలందరును జిల్లాలవాసుల కష్టనిష్ఠురము లెరుగనివారని మేమనము కాని అంతమాత్రమున జిల్లావాసులనుం డికొందరు ప్రముఖులైనను ఈ ముఖ్య కార్యములో ప్రాతినిధ్యము వహించక పోయిన నేమాయెనని మేము త్రోసివే యజాలము. మోయబూనిన భారము విశాలమైనది. దానిని మోయు బలము నకుకూడ వైశాల్యముండుట అవసరము.

పరిషత్తుచే నియోగించబడిన సంఘ మువారు ప్రజాప్రముఖులందరి అభిప్రా యములను లిఖితరూపమున సమకూర్చు చున్నట్లు తెలియుచున్నది. ఈసందర్భ మునైనను జిల్లాలవాసులను మరచిపో కుందురుగాకయని సూచించుచున్నాము పత్రికలు ప్రజలతో ఎక్కువసంబంధము గల సంస్థలుగనుక, ఆపత్రికల అభిప్రా యములనుగూడ పరిషత్సంఘము వారు సంకలనముచేయుట మంచిదని సూచిం చుచున్నాము.

ఇంకొకమాట. ప్రజాభిప్రాయముకొ రకు కొందరు ప్రముఖులకు ప్రశ్నావళి పంపబడినట్లు తెలియుచున్నదని మా ప్రతినిధి తెలుపుచున్నాడు. పరిషత్సం ఘమువారు ప్రశ్నావళినట్లు విరివిగా పంపించుటయేగాక, ఈపాటికిపత్రికలలో ప్రకటించి యుండవలసినది. పత్రికలలో వాటిని చూచిన వారలు వారల అభిప్రా యములను పత్రికల ద్వారానో లేక నేరు గానో పరిషత్సంఘమునకు తెలుపుకొన గోరుచో, అట్లుచేయుటకు అందువలన అవకాశము చిక్కును. పరిషత్సంఘము నకు ఆలోచనకై లభించు ప్రజాభిప్రా యమును సమృద్ధిగనుండును. దానిపై చేయబడు నిర్ణయము ఎక్కువబలము కలిగియుండునని వేరుగా చెప్పవలసిన పనిలేదు, ఇప్పటికైనను పరిషత్సంఘము వారు ప్రశ్నావళిని వెంటనే పత్రికలలో ప్రకటింప జేయుట ముఖ్యము.

## పాండిచరీ ప్రయాణము

హైదరాబాదు నవ ౨౨

రైటు ఆనరబుల్ సర్ అక్బర్ హైదర్ నవాజుజంగు బహద్దురుగారు ... గా ఆరంభించుకుని ... వారము పాండిచెరీకి వెళ్లి అక్కడ ... హైకోర్టు ... గారలు ... డించిరి

అనరబుల్ ... రాజా ... రాజవంత బహ ద్దురుగారు ... సోమవా రంనాటికి పాండిచెరివెళ్లి తిరుపతి ... దక్షిణదేశమందలి పుణ్య క్షేత్రముల సందర్శించి ... ఓ నగరమేతెంచుదురు.

## కాలచక్రం

### సర్ జగదీశ చంద్రబోసు

అధర్మానికే జయమా? జర్మని ఉబలాట—హక్కుల ప్రాకులాట—కార్మికుల కష్టాలు

**జగదీశచంద్రుని నిర్యాణము**

మహాత్మాగాంధీ ఆరోగ్య విషయమై ఆసేతు హిమాచల పర్యంతం అంతా గోషాలమూ అనుర్దాపడుచున్న సమయంలో పిడుగువంటి వార్త వినబడింది. శ్రీ సర్ జగదీశ చంద్రబోసు, హృద్రోగపీడితుడై డెబ్బైతొమ్మిది సంవత్స రాల పండు వయస్సులో పరమపదించినాడు ముఖ్యంగా వంగమాతకు, ఆ మెతరువాత భరత మాతకు ఈ కడుపుకోత భరించరానిది. జగదీశ చంద్రుడి నిర్యాణము భారతదేశానికే కాదు, సమస్త విజ్ఞాన ప్రపంచానికీ విచార విషయము.

సర్వ ప్రపంచానికీ తెలిసిన కొద్దిమంది భార తీయ ప్రముఖులలో జగదీశచంద్రు డొకడు. పూర్వకాలపు ఋషులు దివ్యదృష్టివల్ల గ్రహిం చిన పరమవేదాంత రహస్యాలన్నీ, అధునిక వైజ్ఞానిక శాస్త్రరూపేణా నిరూపించి, వస్తు మయ ప్రపంచంలోపడి అంధకారంలో తిరిగే పాశ్చాత్య శాస్త్రకోవిదులకి ఆర్యవిజ్ఞానంలో వున్న అధిక్యం చూపించినాడు, యంత్ర సహా యం ఏమీ లేకుండా, ఖగోళ ప్రపంచమంతా పరిశీలించిన ఆర్యావర్తపు అధునిక నివాసులు, పాశ్చాత్య ప్రపంచం సిగ్గుకప్పుకోడం తెలియ కుండా అడవుల్లో చెట్లమీద ఆకూ అలమూరిని ఒకరికొకలో, సృష్టిరహస్యం గ్రహించి, సృ ష్టికి ప్రతిసృష్టిచేసి, పరిణామ విపరిణామ పద్ధ తులు గుర్తెరిగి, మహానుభావులుగా వున్నారన్న సంగతి జగదీశచంద్రుడు చాటినంత ప్రభా వంతో ఏభారతీయుడూ చెయ్యలేదు.

మహాత్ముడు, మహాత్ముడే తెలియును మహాత్మ్య రహస్యం గ్రహించడానికిగాని, అది అనుభ వించడానికిగాని మహాత్ముడికే తగును రవీంద్ర నాథ టాగూరుకవి, గాయకుడు, లలితకళా కోవిదుడు, వేదాంతి, పాశ్చాత్యులంతా అయ న్ను ఎంత ... ఆయన విజ్ఞానాన్ని కొనియాడుతారు కవిత్వం అనందిస్తారు. రూష్య ప్రపంచపు చిత్రవస్తుప్రదర్శనశాలలో టాగూరుగారు ఒక ప్రదర్శనార్హమైన వ్యక్తి అధ్యాత్మసిద్ధాంతాలు అనేకులకి అటపాటలలో చెప్పినవాడు టాగూరు, ఎంత చెప్పినా నిరూపిం చడం కవికర్తవ్యంకాదు నిరూపణ లేనిసిద్ధాం తం పాశ్చాత్యులకి అంగీకారంకాదు. సర్వే పల్లి రాధాకృష్ణగారు టాగూరు కవిమీద భాష్యం తో ప్రపంచాన్ని అకర్షించి, పాశ్చాత్యులకి పాశ్చాత్యరూపాలలో ఇవకటి సిద్ధాంతాలే బోధించి, కీర్తి గాంచినకద్ద కొంతవరకు ప్రకట అన్నారు. నిరూపణాధికారం అనవసరంకూడా లేదు.

చంద్రశేఖర వేంకటరామన్ కేవలం పాశ్చాత్యశాస్త్ర పద్ధతులలో వారిని మించి నోబెలు బహుమానం అందినాడు. అయన నూతన సిద్ధాంతాలు పడమటి వారలకేగాని, భారతదేశానికి అంత రుచించవికావు వారివల్ల మనకు లభించి నిమేరలేనికీర్తి. ఆచార్య ప్రఫు ల్లచంద్రుడు మహాత్మునిబోధలు విని రసాయన శాస్త్ర పరిశోధన మాని దేశ సేవా దురంధరు డైనాడు.

అంతర్జాతీయ కీర్తి గడించిన ఈ కొద్దిమంది భారతీయులలో జగదీశచంద్రునిది ప్రత్యేకస్థాన ము.జగదీశుడు కేవలం శాస్త్రజ్ఞుడే కాదు అతడు అచ్చమైన భారతీయుడు. వేదాంతలలో, ఉపనిష త్తులలో ఆయన అంతా తెలిసినచెయ్యిది ఆ మహా వాఙ్మయంలో వున్న రహస్యాలన్నీ సాధారణదృ ష్టికి నిరూపించినాడు జంతుజాలంవరకే పోక లిగిన బుద్ధిగవాడదే అహింసా పరమధర్మం చెట్లుచేమలకూ, రాయిరప్పలకూ కూడా విస్త రింపజేసిన అపరావతారం జగదీశుడు

చిన్నతనంలో సంస్కృత విద్యాభ్యాసం, తరువాత ఆంగ్లవిద్యాభ్యాసంచేసి, ఇంగ్లాండు పోయినాడు. అక్కడ రసాయన శాస్త్రంలో భౌతిక శాస్త్రంలో ఆరితేరినాడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ప్రాముఖ్యత పొందినాడు. వైర్లెస్ కనిపెట్టిన మార్కొని కిలోసల ఈయన అపరిశోధనచేసి విజయము పొందినాడు రంగు దేశం,జాతిభేదం వల్ల తెల్లవారలు ... భారతీయుడికి ఇవ్వలేక పోయినారు అటుతర్వాత జగదీశుడు కలక త్తా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పని చేసినాడు భౌతిక శాస్త్ర పరిశోధనమాని వృక్ష శాస్త్ర నిర్మాణం ప్రారంభించినాడు సృష్టి లో వున్న ప్రాముఖ్యం ... పరిశీలించి వాటి ... ఆయుర్వేదం ... మహా ఔషధశాస్త్రం నిర్మించిన భారతీయులకి వృక్షశాస్త్రం స్వంతసొమ్ము ... అదంతా ప్రాచీనమైన సంస్కృత వాఙ్మయంలో మూ లదిప్పు ... కాని నిజానిజాలు నమ్మితే చెప్ప ... వృక్షశాస్త్రం పాశ్చా త్యులకి ... తెలియదు ... వెంటవ ... లో, సంవత్సరాలు ... రాత్రింబగళ్లు ... చె ట్లుకి ... దని గ్రహించినవాడు బోసు. చెట్లు మొదలు ఇ కప్పు చిన్నచిన్న కదలికలు ... జ్ఞానము మనమనే వాడు. రాయల్ సొసైటీయందు బోసు ఉపన్య సమై ఉపన్యాసంచేస్తే లోలోపల నవ్వుకు న్నారు ఇహప్రపంచ సమస్తులైన తెల్లవారు. బోసు నిస్పృహ చెందలేదు అతి సూక్ష్మమైన యంత్రాలు నిర్మించి తనసిద్ధాంతాలు విరూపిం చినాడు యంత్రాలమూర్తి చూసి ఆశ్చర్య పోయి ఒకపాశ్చాత్యుడు ఇవి ఎక్కడ నిర్మిం చారని అడిగినాడట. యూరోపు అమెరికాదే శాలు చెయ్యలేకపోతే భారతదేశంలో నిర్మిం చారని బోసు సగర్వంగా ఒదులుచెప్పినాడట భగవంతుడనే పరమశక్తి సర్వత్రావున్నదనీ, జీ వుడు కేవలం చరప్రపంచంలోనేకాక, అచర ప్రపంచానికికూడా కద్దని శాస్త్రరూపేణా ని రూపించిన మహానుభావుడు ఇంతవరకు లోనే "ఏకమేవాద్వితీయం" అన్న శ్రీశంకర భగవ త్పాదుల అమూల్యసిద్ధాంతం కళ్లయెదుట చూపించిన మహర్షి జగదీశచంద్రుడు. అజ్ఞాన బంధురమై, పాశ్చాత్యనాగరికతా పీడితమైన అధునిక లోకం బోసు జ్ఞానబోధ గ్రహించలే కపోయినది శాంతిసందేశం సంస్థాపించి, ప్రపంచ రాజకీయాలకు నూతనదృక్పథం నిర్మించిన అవతారమూర్తి మహాత్మునికి నోబెలుశాంతి బహుమానం ఇవ్వడానికి అభిజాత్యపడే పా శ్చాత్యులు బోసుకికూడా ఇవ్వలేదంటే ఆశ్చ ర్యంలేదు, లోటు వారికిగాని మనకుకాదు.జగ దీశచంద్రుని మరణం భారతీయులకేకాదు, లోకానికేతీరనిలోటు, మానవుడుగా అవతరిం చిన భగవానుడే నిర్యాణం చెందవలసి వచ్చిన పృడు, సామాన్యమానవులికి మరణం తప్పదు డెబ్బైతొమ్మిది సంవత్సరాల నిండువయస్సు లో గతించినబోసు, వార్ధక్యం వల్లపోయినా, మనకు ప్రతీపురీరసం డాపోతుందా? ఇంక ఎన్నా ళ్లకి ఇంకో జగదీశచంద్రబోసు వెలుస్తాడు?

**అధర్మానికే జయమా?**

జ్ఞానసమరంలో చనిపోయిన ఒక్క యో ధునికోసం మనంఇంత విచారిస్తూవుంటే చీనా లో రోజుకి లక్షల పదిలక్షల యోధులు అసలు సమరంలో చనిపోతున్నారు జపాను దౌర జన్యం విజృంభించినకొద్దీ, జపాన్నిఆపి, చీనాను రక్షించవలసిన పాశ్చాత్యుల మేధాశక్తి, శరీర శక్తికూడా క్షీణిస్తున్నది కొత్త సంవత్సరంలో గా చీనాముఖ్యపట్టణం నాంకింగు పట్టుకుతీరా మని జపానుచాటించింది చీనా సైన్యంతోచి యాంగ్ కాయ్‌షేక్ దంపతుల నాయకత్వం కింద స్వాతంత్ర్యం కాపాడుకునేందుకు ప్ర యత్నిస్తున్నది. నాంకింగునుంచి ముఖ్యనగరం ఎత్తేసినారు. గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్టు విన్న మొన్న కళ్లుతెరిచిన ఈముక్యపుచిప్పలా యిచ్చిబంగారపు జపానుముందు, ప్రాచీన చీ నాదేశం, అదేశపునాగరికతా, ఇటలీముందు అబిస్సీనియాలా అవుతాయేమోనని భయం ... జంకాదు. ఆదేజరిగితే కలియుగంలో అధర్మమే జయతి.

**జర్మని ఉబలాటం**

హిట్లరునియంత జర్మనీకి కొవలసినవన్నీ సంపాదించినాడు. యూరపు యుద్ధానంతరం అన్నిపోయి ఐశ్వర్యాలుడిగిన జర్మనీ తిరిగి నిత్యకల్యాణం పచ్చతోరణంగా తయారైనది. ఇక మిగిలినది పోయిన వలసరాజ్యాలు, ఇవి కూడా ఇచ్చేస్తే కొంతగోల తగ్గుతుంది, పోను గున పోరుతప్పుతుందని ఇంగ్లాండులో బహు జనాభిప్రాయం అఖరికి అట్లానే జరుగుతుంది. ఏదోవిధంగా జర్మని ఉబలాటం అణచాలని ఇంగ్లాండు ప్రయత్నిస్తున్నది. మొన్న పూర్వపు వైస్రాయి హాలిఫాక్సు ప్రభువు హిట్లరుతో సంభాషించినాడట చివరకేమీ తేలలేదు, జర్మనీ తరఫున వాన్‌న్యూరాత్ లండనువచ్చి రాయ బారమనడుపు తాడని వార్త.

వలసరాజ్యాలు తిరిగి జర్మనీకిస్తే, ఆఫ్రికాలో వున్న భారతీయులకి కొంత ఇబ్బంది కలుగు తుంది అప్పుడే అలజడి వినిపిస్తున్నది అబిసీ నియా ఆక్రమించిన ఇటలీ అదేశాన్ని పరిపా లించడానికి ఎన్నో అవస్థలు పడుతున్నది ముస్ సొలినీ ... నియమిస్తున్నారు, ఏమీ చెయ్యడానికి తోచని ముస్సోలినీ.

**సమానహక్కుల సమరం**

ఇతరప్రపంచం అంతా ఇటువంటి సమస్య లతో వేగిపోతూవుంటే మనదేశంలో స్త్రీలకు పురుషులతో సమానహక్కులు కావాలని పో రాటే ప్రాథమికస్థితిలో వున్నారమనం మొన్న లక్నోలో స్త్రీసమావేశం జరిగింది అసభలో ఉపన్యసిస్తూ శ్రీమతి విజయలక్ష్మీపండిత్, సం యుక్తరాష్ట్రాల స్థానిక స్వపరిపాలనా శాఖ "మంత్రి" భారతీయ స్త్రీ ప్రపంచానికి నూతన బోధచేసింది స్త్రీలు పురుషులతో సమానహ క్కులకోసం పోట్లాడనవసరంలేదని,స్వయంశక్తివల్ల తమహక్కులు సంపాదించాలన్నది ప్రస్తుతం తాము ధరించేభూషణాలవలెనే స్త్రీలుకూడా దేశానికి ఒకరకమైన భూషణాలుగా వున్నార న్నది జవహరులాలు చెల్లెలు, అన్న మాదిరిగానే కుండబద్దలుకొట్టి మాట్లాడింది. నిజమే స్త్రీలకు సమానహక్కులనేమాటలో అర్థంలేదు. స్త్రీ, పురుషుడూ, పురుషుడు స్త్రీ కావడానికి వీలుం టే సమానహక్కులు వుండవచ్చు పురుషులం తాకలిసి, పిల్లల్నికనేహక్కు ఒక్క స్త్రీలకే వుండడమే, పురుషులికికూడా వుండాలని సభ లో తీర్మానం ఆమోదిస్తే ఎంత అందంగావుం టుందో, వాగాడంబరంతో ఎందుకూపనికిరా ని మన నాటి స్త్రీలు సమానహక్కులంటే అంత అందంగావుంటుంది పురుషులికి మీసాలూ గడ్డాలూవున్నవి కాబట్టి స్త్రీలుకూడా ఆ హ క్కులు సంపాదించకూడదనంటే ఎంత హాస్యాస్పదంగావుంటుందో, సర్వ సమానహ క్కులంటే అంతబాగుంటుంది. పరమశివుడు, అర్ధనారీశ్వరుడన్నాడు స్త్రీ పుంలింగముల సంయోగమే సృష్టికారణం అయినప్పుడు, స్త్రీ గాని పురుషుడుగాని ప్రత్యేకవ్యక్తిత్వం పొం దడంకష్టం. ఒక స్త్రీ పురుషుడూ కలిసిగాని మానవత్వం పొందలేరు.రెండుఅర్థలు ఒకటి. అట్లాగే స్త్రీపురుషులు కలిసి ఒకవ్యక్తిగా పరి గణిస్తారు విడివిడిగావారికి హక్కులూ లేవు. బాధ్యతలూలేవు అందుకనే హిందూ సాంప్ర దాయాల ప్రకారం సంసారికిగాని ఏహక్కు లూలేవు. బ్రహ్మచారీ, సన్యాసీ ఎక్కడున్నా ఒకచే శరీరానికి రెండుచేతుల్లాగ, బండికి రెండుచక్రాలలాగ స్త్రీపురుషులు వుండాలి ఇందులో కుడిఎడమలున్నవి, లోపలాబాయలా వున్నవి, కుడిచెయ్యి ఎడమచెయ్యికూడా ఒ కేపనికి వుపయోగిస్తే జీవితంకష్టం. దేనిపని అది చెయ్యాలి. స్త్రీపురుషులుకూడా అంతే ఇందు లో కొందరు ఎడమచెయ్యి వాటంగాళ్లువుంటా రు, స్త్రీలలో పౌరుషంవున్నవారూ, పురుషుల లో బిడియంగలవాళ్లూవుంటారు అటువంటివారు అసహజసృష్టికి సంబంధించినవారు సామాన్య స్త్రీపురుషులు ఎవరిపనివారు చెయ్యాలి, లేకా కథంతా అడ్డంతిరుగుతుంది.

**కార్మికుల కష్టాలు**

ఒక్క స్త్రీపురుషుల తగాదాలేకాదు. ఎ క్కువతక్కువ తగాదాలు మనకుచాలావున్నవి. కూలివాండ్లూ, అసాములూవున్నారు. అసాము లి అకలిమితంలేదు కూలివాళ్లని వేధించుకుతిని లాభంపొందడమే వారివంతు మానవుల పౌర సత్వపుహక్కులు ఇప్పుడిప్పుడే గ్రహిస్తున్న మనదేశంలో కార్మికులు అలజడి చేస్తున్నారు. వి.వి.గిరివంటి మహానుభావుల ధర్మమా అని కా ర్మికులికికూడా ఒకస్థానం సర్వత్రా లభిస్తున్న ది. కాని అన్యాయాలు ఇంకాపోలేదు. కాం గ్రెసుసంస్థ సర్వజనులహక్కులూ సంరక్షించు టానికి పూనుకున్నా ఇంతవరకు కార్మికులికి ప్రత్యేకంగా చేసిందిలేదు. చాలావరకు కాంగ్రె సు అసాములసంస్థగా వుండిపోయింది. మొన్న నే గాంధీమహాత్ముడు, దరిద్ర నారాయణుడు, దీనబంధువు, కాంగ్రెసు మంత్రులకి కార్మికుల కష్టాలు పరిశీలించమని హెచ్చరించవలసివచ్చిం ది. మద్యరాష్ట్రంలో కాంగ్రెసు మంత్రులు గరళకంఠను అనుభవించవలసి వచ్చింది. ఇదివ రకు ప్రభుత్వాలు ఇటువంటివిచేస్తే విమర్శించిన కాంగ్రెసు తానే ఇటువంటివిచెయ్యడం శోచ నీయం.

**అర్థం కావాలి**

కొరవపోతే ప్రతిదానికీ "దౌర్జన్యం" అనే పదం ప్రయోగిస్తున్నారు. అజ్ఞానులైన ప్రజలు దౌర్జన్యం ప్రయోగిస్తే తాముకూడా ఆదేశేస్తు న్న మ ... మిమిమండింది? శాంతియు తంగా వుండాలట సమరం శాంతిభంగంచేస్తే గాని ... లాంగకపోతే ఏంచెయ్యాలో? బొబ్బిలి లాంటి వియ్యంకుడు రాజాజీ నిర్బంధిస్తే సహిం చినాను గాంధీజీ ... ప్రభుత్వంలో దౌర్జ న్యం వుండకూడదన్నాడు పోలీసు సహాయం కావలిసిన మంత్రులు వున్నా లేకపోయినా ... మహాత్ముని వచనాలు మహా త్ములకే అర్థంకావాలి!

—శ్రీమతి

## ఆయుర్వేద వైద్యసంఘ వార్షికోత్సవము

నవంబరు ౨౦వతేది మొదలు ... వరకు హైదరాబాదు ఆయుర్వేదవైద్యసంఘ ౧౦వ వార్షికోత్సవమును, ధన్వంతరి జయంతియు డాక్టరు అచంట లక్ష్మీపతి గారి అధ్యక్షత క్రింద రెడ్డిబోర్డింగు హాలులో జరుపబడునని సంఘ కార్యదర్శి గారు తెలుపుచున్నారు.

## గౌరవ మేజస్ట్రేటుగా హరిజనుని నియామకము

సికిందరాబాదు కంటోన్మెంటు ప్రభుత్వపు ప్రశంస చర్య

(గోలకొండ ప్రత్యేక ప్రతినిధి)

సికిందరాబాదు నవంబరు ౨౪

హరిజననాయకులగు శ్రీ బి. యస్. వెంకట రావు కంట్రాక్టరుగారు సికింద్రాబాదు కంటో న్మెంటు ప్రభుత్వమువారిచే సికిందరాబాదు గౌరవబెంచు మేజిస్ట్రేటుగా నియమింపబడిన ట్లు రూఢిగా తెలియుచున్నది. శ్రీవెంకటరావు గారిటీవలనే నిజాంప్రభుత్వమువారిచే నగర పురపాలకసంఘమునందు హరిజనుల పక్షమున ప్రతినిధిగా నియోజింపబడిరి

## ఆంధ్ర ఆయుర్వేద మహాసభ

### శ్రీ ప్రతాపరెడ్డిగారు అధ్యక్షత వహింతురు

హైదరాబాదు: నవం. 24

"నిజాంరాష్ట్రాంధ్ర ఆయుర్వేద మహాసభ కార్యదర్శులు దిగువప్రకటన గావించుచున్నారు:—

1937 డిసెంబరు 26—28వ తేదీలలో నిజామాబాదునందు జరుగబోవు ఆరవ నిజాంరాష్ట్రాంధ్ర మహాసభతో బాటు ప్రథమ నిజాంరాష్ట్ర ఆంధ్ర ఆయుర్వేదమహాసభ జరుగును. శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి ఏ, బి ఎల్ గారు అధ్యక్షత వహింతురు. ఇందు తెలంగాణా జిల్లాలలోని ఆయుర్వేద వైద్యుల సర్వతోముఖాభివృద్ధి కవసరములగు తీర్మానములు చర్చించి మన రాష్ట్రమున ఆయుర్వేదాభివృద్ధికి ప్రచారము చేయబడును. కనుక ఆయుర్వేదమునం దభిమానము గలవారెల్లరును మహాసభనువిచ్చేసి చర్చలయందును, కార్యక్రమములందును పాల్గొన ప్రార్థితులు.

మహాసభతో బాటు ఆయుర్వేదౌషధాది ప్రదర్శనమును, మూలికా ప్రదర్శనమును జరుగగలవు. కనుక ప్రదర్శనములందు పాల్గొనదలచువారు ముందుగా కార్యదర్శులతో సంప్రతించుట కాని, ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుట కాని ముఖ్యమనిమనవి.

ప్రతినిధులుగా చేరదలచువారు ఎనిమిది అణాలు చెల్లించవలెను. ఇతరవివరములకై కార్యాలయమునకు (1818 సుల్తానబజారు) వ్రాయ ప్రార్థితులు."

## రు 1000 విరాళము

నవంబరు 15వ తేదిని బెజవాడ నగరమందు ఆంధ్ర కురుక్షేత్ర నాటక ప్రదర్శన ఆదాయము వేయిరూప్యములను నాటక సంఘాధ్యక్షులైన వినోదరత్నాకర శ్రీ సుబ్బి వీరన్నగారు నిజాంరాష్ట్ర వీరశైవ గురుకులాభివృద్ధికై యొసగిరి. ఈప్రదర్శనముయొక్క టికట్లపై వసూలు చేయుసుంకము (స్టాంపుడ్యూటీ)ను బెజవాడ మ్యునిసిపాలిటీవారు తీసివేసిరి

## మద్యపాన నిషేధ ప్రభావము

సేలం నవ 23

ఈజిల్లాయందు మద్యపాన నిషేధ మారంభింపబడినప్పటినుండ నేరములసంఖ్య పూర్వముకన్న చాలా తగ్గినది,

మొత్తము సివిలు నేరములనుండి జరిగిన హత్యానేరములు 1 శాతము అక్టోబరులో తగ్గినవి, ఇతరవిధములగు నేరములలో ప్రతిశతి 35 వరకు తగ్గినవి

మద్యపాన నేర సంబంధములో కొలారు సారము ప్రజలకు ఖదితముగనున్న వీటిసంఖ్యయు తగ్గుచూవనలు గోచరించుచున్నవి ఈ నేర విషయమునందు కఠినమగు శిక్ష లేర్పడియుండుటవలన ప్రజలలో సంస్కార మధికరలో కలుగవచ్చును

శాసనము ఫలవంతమగుటకు ప్రజాభిప్రాయము ముఖ్యముగా పెంపొందుచున్నది నేరమాపివేయుటకు, చూకీ కనుగొనుటకు ప్రజలు స్వంతముగా ప్రయత్నించుట శుభావహము

## ప్రత్తివిత్తులపై దిగుమతి సుంకపు తగ్గింపు

ప్రభుత్వ ప్రకట శాఖవారు ఈక్రింది ప్రకటనను పంపినారు —

ఈకార్యాలయమునుండి వెలువడిన 10 నవంబరు 1938వ తేదిగల ప్రకటనప్రకారము ప్రత్తివిత్తులపై ఎగుమతిసుంకము పల్లాంకి రెండణాలవంతున నిర్ణయించబడినది. ఇపుడు ఆ విత్తనములపై దిగుమతిసుంకముకూడ పల్లాంకి 8 అణాల రేటునుండి పల్లాంకి రెండణాల రేటుకు తగ్గించబడినది.



## ... సంస్థాన ప్రజాసేవక పరిషత్తు

అఖిలభారత సంస్థాన ప్రజా మహాసభా కార్యదర్శియగు శ్రీయుత బలవంతరే మెహతాగారు సంస్థాన ప్రజాసేవకులకిట్లు వ్రాయుచున్నారు —

సంస్థానములందు అఖిలశించని ఫెడరేషన్ ప్రవేశమువలన కలుగుచున్న అపాయపరిస్థితుల పరిశీలించుటకు, ప్రతిఘటించుటకు తగినమార్గము లాలోచించుటకు సంస్థాన ప్రజాసేవకుల పరిషత్తొకటి యేర్పరచ అ భా సం ప్ర. మహాసభయందు తీర్మానించబడినది.

పరిషత్తునందు యితరవిషయములతో బాటు రోజురోజు యేర్పడుచుండు సమర పరిస్థితుల నిజవృత్తాంతములు ప్రకటనలద్వారా వివరించుటకు నిర్ణయింపబడును కేంద్ర సంఘముతో అఖిలభారత సంస్థాన ప్రజాసేవకులందరు సహకారమొసర్చిననే యీ కార్యము నెరవేరగలదు

ఇంతేగాక వివిధరాష్ట్రములందు జరుగుచున్న ప్రజాసంచలనములను ప్రజా పరిస్థితులను, చరిత్రరూపమున ప్రకటించుట ట్యవసరము సంస్థానముల ప్రజాభ్యుదయమునకు నిష్కామమ్మముగా జీవితము లర్పించు త్యాగమూర్తుల ఆమూల్యసేవల స్వీకరించి యాధీనమునందు రాష్ట్రముల నిర్ణయించుటయే నేడు మనకందరికి ముఖ్యసమస్యగాగలదు. కేంద్ర రాష్ట్రీయ సేవకుల సహకారము లేనిది మన యీకార్యము నెరవేరజాలదను విషయము వ్యక్తిగతానుభవములవలన ప్రతివారెరింగినదే. కాబట్టి మనయందరమీ ముఖ్యసమస్య పరిష్కారమునకు నుత్తమమార్గము కనిపెట్టు టత్యావశ్యకము.

సంస్థానములందు కాంగ్రెసు సంచలనము లశక్తి కొలది పెంపొందించుటకు ప్రయత్నించుట ముఖ్యాతిముఖ్యము కాంగ్రెసు నిర్మాణమువలన మన కపారశక్తి సామర్థ్యము లలవడితీరును దీనితో యుక్యమునకు నక్కర చేయూత కలుగును

పరిషత్తునందిట్టి అవసరవిషయములు నిర్ణయింపబడును, వివిధ స్థానములందలి స్థానిక, రాష్ట్రీయ సంచలనములకు చేయూత యేర్పడును, దీనివలన ప్రజాసేవకులలో సమిష్టి ఆదర్శ సాఫల్యతకు నూతనోత్సాహము పెంపొందితీరును

ఈపరిషత్తు సంపూర్ణముగ ప్రాతినిధ్య పద్ధతులపై యేర్పడితీరువలెనని నిశ్చయము

---

